# శ్రీ వేంకటేశ్వర కృష్ణమంజరి స్తుతి

పరిష్కర్త

ఆచార్య కె.జె. కృష్ణమూర్తి

ప్రచురణ



తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

# శ్రీవేంకటేశ్వర కృష్ణమంజరి

## మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము


సాధారణ సంపాదకుడు :

**బి.యస్. రెడ్డి (భూమన్)**

సంచాలకుడు, తి.తి.దే. "శ్వేత", తిరుపతి






పరిష్కర్త : ఆచార్య కె.జె. కృష్ణమూర్తి

తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్ట్

తి.తి.దే. "శ్వేత" తిరుపతి



ప్రచురణ

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2007**

ŚRĪ VEṄKAṬEŚVARA KṚṢṆA MAÑJARI
(STUTI KĀVYAMU)
MĀTṚŚRĪ TARIGOṆḌA VEṄGAMĀMBA

Edited by
**Prof. K.J. Krishnamoorthy**
Tarigoṇḍa Veṅgamāmba Vāṅmaya Project
"SVETA", T.T.D., TIRUPATI.

TTD "SVETA" Religious Publications Series No : 5


First Edition: 2007

Copies : 5000

Cover Design : **P. Srinivas**

Published by
**A.P.V.N. SARMA,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
TIRUPATI - 517 507

DTP & Printed at
**Sri Parasarya Press**
Sri Vyasasramam
Ph: 08578-287528

# ముందుమాట

కలియుగదైవంగా ప్రశస్తిగాంచిన వేంకటరమణుని భక్తపరంపరలో ఒక్కొక్కరిది ఒక విశిష్టత. ఈ విశిష్టత ఆ యా భక్తులు శ్రీవారిని ఆరాధించటంలో అవలంబించిన మార్గాలవల్ల మనకు వెల్లడవుతూవుంటుంది. 'శ్రీవేంకటాచల మాహాత్మ్యం' వంటి సరస కావ్యాలను స్వామికి సమర్పించి తరించిన తరిగొండ వెంగమాంబ ఆ దేవ దేవుని భక్తబృందంలో అగ్రగణ్యయైన కవయిత్రీశిరోమణి!

ఈ 'కవితాతపస్విని' తిరుమల క్షేత్రంలో తపోవనం లాంటి ఒక తులసీ బృందావనాన్ని నెలకొల్పింది. ఆ 'బృందావనం'లో రాజయోగసాధనతో పాటు, వాఙ్మయ తపస్సు కావిస్తూ శ్రీనివాసునకు అంకితంగా అనేక కృతులను వెలువరించింది.

ఈ మహాకవయిత్రి రచించిన పదునెనిమిది కృతుల్లో చాలా భాగం అముద్రితంగా, సాహితీపరులకు అందుబాటులో లేనివిగా అజ్ఞాతంగా ఉంటు న్నాయి. తిరుమలేశునికి మీదుకట్టి అవతరించిన ఈ రచనల నన్నిటిని ప్రచురించవలసిన ఆవశ్యకతను గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం ఈ కవయిత్రి పేరట ఒక గ్రంథ పరిష్కరణ ప్రాజెక్టును నెలకొల్పింది. ఈ ప్రాజెక్టు నిర్వహణ బాధ్యతలను తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులయిన శ్రీ 'భూమన్' గారికి అప్పగించింది.

ఉద్యమస్ఫూర్తి మేళవించిన ఉత్సాహపూరితులయిన "శ్వేత" సంచాలకులు శ్రీ 'భూమన్' గారు ఇటీవలే ఈ కవయిత్రి సారస్వతంపై ఒక జాతీయ సాహితీ సదస్సును విజయవంతంగా నిర్వహించటమే కాక, ఈ కవయిత్రి రచనల యందలి వేర్వేరు గీతాలకు ఆడియో సీ.డీ.లను తగిన గాయనీ గాయకులచే తయారు చేయిస్తుండటం మిగుల ముదావహమయిన విషయం.

హరికీర్తనాచార్యుడైన తాళ్లపాక అన్నమాచార్యుల జయంతి ఉత్సవాల లాగానే, ఈ కవయిత్రి యొక్క సాహితీ సమారాధనోత్సవాలను ఈమె జన్మదినమైన నృసింహుని జయంతి సందర్భంగా ప్రతి సంవత్సరం నిర్వహించడానికికూడా

తిరుమల తిరుపతి దేవస్థానం నిశ్చయించింది. ఇందులకు అనుగుణంగా మే 1వ తేదీన జరుపబోయే వెంగమాంబ జయంతి ఉత్సవ సందర్భంలో ఆవిష్కరించే నిమిత్తంగా ఈ క్రింది ప్రచురణలను చేపట్టి సిద్ధంచేస్తూవుండటం ఆహ్లాదదాయకంగా ఉంది.

1. తరిగొండ నృసింహాశతకము

2. శ్రీవేంకటేశ్వర కృష్ణమంజరి (స్తుతి కావ్యము)

3. రమా పరిణయము (ద్విపద కావ్యము)

4. బాలకృష్ణ నాటకము (యక్షగానము)

5. చెంచు నాటకము (యక్షగానము)

6. భక్తిగీత సుధాలహరి (వెంగమాంబ యక్షగానాల్లోని 108 గేయాల సంకలనం)

7. అష్టాంగయోగ సారము (పద్యకావ్యము)

ఈ ప్రచురణలన్నీ సహృదయ సాహితీ లోకాన్ని అలరింపజేయగలవని ఆశిస్తున్నాను.

ఇలాగే ఈ భక్త కవయిత్రియొక్క రచనలన్నీ శ్రీనివాసుని దివ్యానుగ్రహ విశేషంచేత అచిరకాలంలోనే చక్కని పీఠికలతో గూడిన సుపరిష్కృత రూపాలతో వెలుగుచూడగలవని ఆకాంక్షిస్తున్నాను.

తిరుపతి
28, మార్చి 2007

ఎ.పి.వి.ఎన్. శర్మ
శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు
తిరుమల తిరుపతి దేవస్థానములు.

# మనవి

తెలుగులో అన్నమయ్య తరువాత రాశిలోనూ, వాసిలోనూ విష్ణు సాహిత్యాన్ని విరివిగా అందించిన మహాకవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. వెంగమాంబ 'తెలుగు మీరా'గా సుప్రసిద్ధురాలై, పోతనతో సాటియైన భక్తకవయిత్రిగా ప్రస్తుతింపబడింది.

శ్రీనివాసుణ్ణి రసరమ్యములైన కావ్యకుసుమాలతో పూజించి తరించిన సుమధుర సారస్వతమూర్తి తరిగొండ వెంగమాంబ. ఈ కవయిత్రి రచనలు శ్రీవేంకటేశ్వరుని సాహితీ మందిరంలో వెలిగించిన అఖండ దీపాలు. ఆ దీప కళికల కాంతులు ఈనాటికీ నిరంతరం ఆ తిరుమలేశుని దివ్య వైభవాన్ని అక్షరంగా ప్రకాశింపజేస్తున్నాయి.

తిరుపతికి పశ్చిమాన 100 కి.మీ. దూరంలో తరిగొండ గ్రామంలో ప్రభవించి, మధురకవితా సుధాధారలతో శ్రీ వేంకటేశుని అభిషేకించి తరించిన తెలుగు కవయిత్రి, అఖిలాంధ్ర జనయిత్రి తరిగొండ వెంగమాంబ.

సాంఘిక దురాచారాలపై సమరం ప్రకటించి, బాల వితంతువులపై ఆ నాడు జరిగే అన్యాయాలను ప్రతిఘటించి– తనకోసం కాదు– తనవంటి అభాగినులపై సంప్రదాయం పేరిట జరిగే అమానుష కృత్యాలను ఎదిరించి, తిరుగుబాటు బావుటా ఎగురవేసిన విప్లవవనిత వెంగమాంబ.

అనేకానేక ప్రక్రియలలో శతకాలు, యక్షగానాలు, ద్విపదలు, తత్త్వ సంబంధమయిన రచనలు, శ్రుతి, లయ సమన్వితములైన వేదాంతగీతాలు వెలయించటమేగాక, శ్రీ వేంకటాచలమాహాత్మ్యంవంటి బృహత్కావ్యములను రచించిన విదుషీమణి వెంగమాంబ.

శ్రీతరిగొండ వెంగమాంబ విశిష్ట వ్యక్తిత్వాన్ని పసిగట్టిన తిరుమల–తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి, గౌరవనీయులు, సంస్కారి శ్రీ ఏ.పి.వి.యన్.శర్మ గారు ఈ కవయిత్రి రచనలను పరిష్కరించి, ప్రచురించుటకుగాను

'తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు'ను ఏర్పరచి అందుకు పరిష్కర్తగా శ్రీ కె.జె.కృష్ణమూర్తిగారిని నియమించినారు. ఆ ప్రాజెక్టు "శ్వేత" ఆధ్వర్యంలో పనిచేసేట్టుగా ఆదేశించినారు. స్వయాన సాహితీప్రియుణ్ణి అయిన నాకు తరిగొండ వెంగమాంబను గురించి తెలుసుకునే అవకాశం ఈ రకంగా కలిగింది. వెంటనే ఆమె సాహిత్యంమీద రెండు రోజులు జాతీయ సాహితీసదస్సు నిర్వహించటం, అనంతరం పుస్తక ముద్రణతో పాటు, ఆమె పాటలకు బాణీలు కూర్పించి, ఆడియో సి.డి.లుగా విడుదల చేయటానికి పూనుకున్నాను. తిరుమల-తిరుపతి దేవస్థానముల చరిత్రలో మొట్టమొదటి సారిగా ఆమె జన్మదినం సందర్భంగా రెండు రోజులపాటు సంగీత, సాహిత్య కార్యక్రమాలు నిర్వహించతలపెట్టినాను. అతి త్వరలో అన్ని పుస్తకాల ముద్రణ, పాటల ఆడియో సి.డి.ల విడుదల పూర్తి చెయ్యాలనే పట్టుదలతో ఉన్నాము.

ఈ బృహత్ కార్యక్రమము సఫలీకృతం కావటానికి పూర్తి కారకులు శ్రీ ఏ.పి.వి.యన్.శర్మగారు; మా ప్రియతమ కార్యనిర్వహణాధికారి. వారికి తెలుగు సాహితీ, సంగీత ప్రియుల పక్షాన ధన్యవాదాలు.

**బి.యస్.రెడ్డి**
సంచాలకులు
**"శ్వేత"**

# పీఠిక

శ్రీవేంకటేశ్వరుని దివ్యపాదయుగళికి సమర్పితమైన కమనీయకృతి "శ్రీవేంకటేశ్వర కృష్ణమంజరి". భక్త కవయిత్రియైన మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ తుంబురుకోనలో ఇంచుమించు ఆరేండ్లు తీవ్ర తపస్సాధన కావించిన అనంతరం మళ్లీ తిరుమల క్షేత్రాన్ని చేరుకొని, అచ్చట తాను నెలకొల్పిన బృందావనం (తులసిమొక్కలతో గూడిన పూలతోట) నడుమ ఏకపాదంపై (ఒంటికాలిమీద) నిలిచి, అత్యాశువుగా చెప్పిన స్తోత్ర మిది!

'మంజరి' దేశీయ ఛందస్సుల్లో నొకటి. ప్రాసనియమం లేని ద్విపదయే 'మంజరి'. శ్రీవేంకటేశ్వరునికి శ్రీకృష్ణునికి అభేదభావాన్ని భజిస్తూ చెప్పబడి నందువలన ఇందులో ప్రతి రెండవపాదం చివర "కృష్ణ!"– అనే సంబోధన నియతంగా నెలకొల్పబడింది. ఈ సంబోధన మకుట లక్షణాన్ని పుణికి పుచ్చుకొని, ఈ కృతికి శతకస్వరూపాన్ని ప్రసాదించింది. ఈ కారణంచేతనే వంగూరి సుబ్బారావుగారు 'శతకవుల చరిత్రము'లో దీనిని ద్విపదశతకంగా పరిగణించారు.

మంజరీ ఛందం దేవతాస్తుతికి మిగుల అనువైనదని ప్రాచీన లాక్షణికులైన అనంతామాత్యుడు, అప్పకవి మొదలైనవారు అభిప్రాయ పడినారు. వాళ్ల అభిప్రాయం ప్రత్యక్షరసత్యమని ఈ మహాకవయిత్రియొక్క ప్రస్తుతరచన చక్కగా నిరూపిస్తూవుంది.

శ్రీమద్భాగవతంలో పేర్కొనబడిన నవవిధభక్తిమార్గాలు - అందులోనూ ముఖ్యంగా పాద సంసేవనము, దాస్యము, ఆత్మ నివేదనము– అనే మూడు మార్గాలూ 'ప్రపత్తి'లో పర్యవసిస్తాయి. ఆ మార్గాల్ని ఆచరణపూర్వకంగా అనుసరించిన వెంగమాంబ ప్రపత్తి భావన ఈ కావ్యంలో అడుగడుగున సొంపుగా పరిమళిస్తూవుంది. ఇవేగాక, 'ద్వయము', 'చరమ శ్లోకము', 'శేషశేషి న్యాయము', 'మర్కటకిశోర న్యాయము', 'మార్జాలకిశోర

న్యాయము'- వంటి విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయ విశేషాలు ఈ స్తోత్రంలో ఎడనెడ అత్యంత సహజంగా, సందర్భానుగుణంగా చోటుచేసికొనివున్నాయి.

అడుగడుగున "కృష్ణ!" సంబోధనలతో, పాటగా పాడుకోవటానికి అనువయిన మనోహరశైలిలో జాల్వారిన ఈ "మధురకృతి" ప్రతిదిన పారాయణార్థమై ప్రకాశిస్తూవుంది.

తిరుపతి, తత్పరిసర ప్రాంతాల్లోనేగాక, మదనపల్లి, గుంటూరు, నెల్లూరు, కడప- మొదలయిన ఆంధ్రదేశంలోగల వివిధ ప్రాంతాలలోని భక్తజనులు- అందులోనూ ముఖ్యంగా మహిళామణులు ఈ రమణీయ స్తోత్రాన్ని ప్రతిదినమూ శ్రావ్యంగా గానంచేస్తూ ఆనందిస్తూ వుండేవారు. హోసూరులో కూడ ఒక వ్రాతప్రతి లభించటంచేత, దక్షిణాదిలోనూ ఇది బాగా ప్రచారాన్ని పొందివుండినట్లు వెల్లడౌతున్నది.

శ్రీవేంకటేశ్వరుణ్ణి శ్రీకృష్ణునిగా భావించి తన్మయీభావంతో చెప్పబడి నందువలన ఈ స్తోత్రం ప్రజానీకంలో భక్తిభావాన్ని ప్రబోధించటంలో మిగుల ప్రభావశాలియైన కృతిరత్నంగా భావింపబడుతున్నది.

ఈ లఘుకృతి ఇంతకు పూర్వం ఏడెనిమిది పర్యాయాలు ముద్రితమై వున్నా, ఇప్పుడు ఆ ముద్రితప్రతులు అరుదైపోయాయి. చెన్నై దివ్యజ్ఞాన సమాజం వారి అడయారు గ్రంథాలయంలోని 75042 (బి)- అనే సంఖ్యగల తాళపత్ర ప్రతి ఆధారంతో ఈ పరిష్కృత ప్రతి తయారుచేయబడింది. ఆ తాళపత్ర ప్రతియందలి వ్రాత తప్పులను సవరించి, లభించిన ముద్రిత ప్రతులతో సరిపోల్చి, ప్రకృతప్రతి సిద్ధంచేయబడింది.

మొత్తంమీద, ఇది కవయిత్రి ప్రయోగించిన పలుకుబడికి అభిన్నంగానూ, అత్యంత సన్నిహితంగానూ, సమగ్రంగానూ ఉండవలెననే పూనికతో

ఈ పరిష్కరణ కార్యం కొనసాగింది. భక్తిరస భరితమైన ఈ స్తోత్రాన్ని ఇతఃపూర్వం ప్రచురించిన ఆస్తిక మహాశయులందరికీ, తాళపత్ర ప్రతికి 'జిరాక్సు' ప్రతిని పంపిన అడయారు లైబ్రరీవారికీ ఇందుమూలంగా కృతజ్ఞతలు తెల్పుతున్నాము.

తి.తి.దే. "శ్వేత" సంస్థ పక్షాన ప్రచురింపబడుతూవున్న ఈ సుందర స్తుతి కావ్యం రసజ్ఞులకు ఆహ్లాదదాయకం కాగలదని ఆశయము.

ఈ కవయిత్రీమతల్లి పేర్కొన్నట్లు "కృష్ణ జపతుల్యమూ, మోక్షప్రదమూ"- అయిన ఈ కృతిరత్నాన్ని అక్షరాస్యు లందరూ పఠించి, "నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే"- అనే సూక్తిని సార్థకం చెయ్యగలరని ఆకాంక్ష.



# కృతజ్ఞతలు

తిరుపతి ఉత్సవాల్లో మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ సారస్వతాన్నిగూర్చి ఉపన్యసించే సదవకాశాన్ని కల్పించటం ద్వారా ఈ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుకు మూలవిరాట్టుగా అంకురార్పణ కావించిన సహృదయవతంసులు తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి అధ్యక్షవర్యులు శ్రీ భూమన కరుణాకరరెడ్డి మహోదయులకు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి సభ్యులెల్లరకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టు రూపొందటంలో మూలకారణులయిన సహృదయవతంసులు తిరుమల తిరుపతి దేవస్థాన శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు, సుగృహీతనామధేయులు శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ, ఐ.ఏ.యస్., మహోదయులకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

తిరుమలలో సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ జి. బలరామయ్య, ఐ.ఏ.యస్.,గారు, తిరుపతిలో సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీఎన్.శ్రీకాంత్, ఐ.ఏ.యస్.,గారు– ఈ ఉన్నతాధికారు లిరువురకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుయొక్క సర్వతోముఖమైన వికాసానికి తమ ఉద్యమస్ఫూర్తిని ప్రసాదించి, ఉత్సాహ, ప్రభుశక్తి పూరితమైన దక్షతతో ముందుకు నడిపిస్తూవున్న తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులు, సహృదయవతంసులు, "భూమన్"గా సుగృహీత నామధేయులయిన శ్రీ భూమన్ సుబ్రహ్మణ్యంరెడ్డి మహోదయులకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

తి.తి.దే. పౌరసంబంధాధికారివర్యులు సరసహృదయులు శ్రీయుతులు కె.రామ్ పుల్లారెడ్డిగారికి నా అనేక హార్దిక కృతజ్ఞతాభివాదములు.

టి.టి.డి. "శ్వేత" కేంద్రగ్రంథాలయం లైబ్రేరియన్ సోదరీమణి శ్రీమతి ఎన్. లీలావతిగారికి, వారి సహాయోద్యోగులయిన మిత్రబృంద మందరికీ-

"శ్వేత" సంస్థ కార్యాలయం సూపరిండెంటెంట్ శ్రీ వి. దామోదరం గారికి, వారి సహోద్యోగిబృందమందరికీ, మిత్రుడు శ్రీ జి. సురేష్‌కుమార్ (యు.డి.సి) గారికి-

"శ్వేత" సంస్థ కో-ఆర్డినేటర్స్ శ్రీ పి. రమణారెడ్డిగారికి, మిత్రుడు డా॥ యన్.యస్. బాలాజీరావుగారికి, తదితర మిత్రులందరకూ-

నా అనేక హార్దిక కృతజ్ఞతాభినందనములు.

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థ డైరెక్టర్ ఆచార్య వి. వేంకటరమణారెడ్డిగారికి, వారి సహోద్యోగులకు అనేక హార్దిక కృతజ్ఞతాభి నందనములు.

ఈ పుస్తకమును ముచ్చటగా ముద్రించిన శ్రీవ్యాసాశ్రమము (ఏర్పేడు) శ్రీపారాశర్య ముద్రణాలయము వారికి నా హార్దిక కృతజ్ఞతాభినందనములు.

మాతృశ్రీ తరిగొండవెంగమాంబాకవయిత్రియొక్క ఆరాధ్య దైవమయిన "శ్రీతరిగొండ శేషకుధరాధ్యక్షు"నకు నా భక్తిపూర్వక ప్రణామాంజలి.

--కె.జె. కృష్ణమూర్తి

# శ్రీవేంకటేశ్వర కృష్ణమంజరి

## విషయ సూచిక

# శ్రీవేంకటేశ్వర కృష్ణ మంజరి

## * ప్రారంభము *

శ్రీ వేంకటేశ! నా - చిత్తంబునందు
నీ పాదయుగళంబు - నిలుపవే! కృష్ణ! 1

నన్నేలు తఱిగొండ - నరమృగాకృతిని
ప్రత్యక్షమై నన్ను - పాలింపు కృష్ణ! 2

పాపకర్మములు త - ప్పక చేసి చేసి
బహు జన్మముల నెత్తి - బడలితి కృష్ణ! 3

ఈ జన్మమందైన - నేను నీ మాయ
గడచెదనన్న శ - క్యము గాదు కృష్ణ! 4

హరి! నీ పదాంబుజం - బను నావ నిచ్చి
మాయాబ్ధి దాఁటించి - మనుపవే! కృష్ణ! 5

బలసి అవిద్య పా - పములు నాచేత
ఉడుగక చేయింపు - చున్నదే! కృష్ణ! 6

మునుపటి దుష్కర్మ - ములు మించి యిపుడు
ప్రారబ్ధ రోగ రూ - పము లాయె కృష్ణ! 7

కాన నే నింక దు - ష్కర్మముల్ చేయ
[1]వెఱతు, నన్ను న విద్య - విడువదో కృష్ణ! 8

---

సూచన: ఈ కృతికి సంబంధించిన వేర్వేఱు ముద్రిత ప్రతులలో లభించిన అర్థవంతములైన ముఖ్యపాఠాంతరాలు ఇందు ఆయా చోట్ల అధోజ్ఞాపికలుగా ఇవ్వబడియున్నాయి.

1. వెఱతు నవిద్య నన్ - విడువదే! కృష్ణ!

తెమలక నన్ను వే - ధింపుచున్నట్టి
అమిత మూలావిద్య - నణఁపవే! కృష్ణ! 9

నా దుర్గుణంబులు - నశియింపఁజేసి
భూరి సద్గుణములే - పుట్టింపు కృష్ణ! 10

దుర్జన సఖ్యంబు - దూరంబుఁ జేసి
ఘనసాధుజనమైత్రి - కల్పింపు కృష్ణ! 11

కలనైన నీమూర్తి - గాని యన్యంబు
నేమైనఁ గనిపింప - నీయకే! కృష్ణ! 12

## ✳ స్వరూపము ✳

కనకరత్న ప్రభా - కలితమైనట్టి
సురుచిర మకుటంబుఁ - జూపవే! కృష్ణ! 13

[2]తళుకొత్తు కుటిల కుం - తలయుక్తమైన
సలలిత ఫాలదే - శముఁ జూపు కృష్ణ! 14

ఘనసార కస్తూరి - కా మిశ్రమైన
కలితోర్ధ్వపుండ్రంబుఁ - గాన్పింపు కృష్ణ! 15

సుందర భ్రూలతా - శోభితంబైన
కనుగవ బెళుకు చ-క్కఁగఁ జూపు కృష్ణ! 16

ముదిరిన[3]సంపెంగ - మొగ్గ కైవడిని
కమనీయమగు నాసి - కముఁ జూపు కృష్ణ! 17

---

2. తళుకైన 3 సంపంగి

నిరుపమ కుంద స – న్నిభ దంతచయము
రమణీయ బింబాధ – రముఁ జూపు కృష్ణ! 18

పలుమఱు సిరుల జొం – పము లీనుచున్న
చెక్కుటద్దములు మ – చ్చికఁ జూపు కృష్ణ! 19

మకరకుండలయుగ్మ – [4]మణి కళాకలిత
గండభాగములు త – క్కక చూపు కృష్ణ! 20

మెఱుఁగైన కురికురి – మీసంబు లమర
సొగసైన చుబుకంబుఁ – జూపవే! కృష్ణ! 21

ఇన్ని చిహ్నంబుల – కిరవైన వదన
పరిపూర్ణ చంద్రబిం – బముఁ జూపు కృష్ణ! 22

శంఖచక్ర గదాబ్జ – సహితంబులగుచు
ఒనరు చతుర్బాహు – వులు చూపు కృష్ణ! 23

కౌస్తుభ మణిహార – కలితమై, కంబు
నిభమైన కంఠంబు – నెఱిఁ జూపు కృష్ణ! 24

సిస్తుగా వనమాల – శ్రీవత్సములకు
సదనమైనట్టి వ – క్షముఁ జూపు కృష్ణ! 25

బ్రహ్మాండ భాండముల్ – [5]బహుకోటులుండ
సూక్ష్మమౌ నుదర మ – చ్చుగఁ జూపు కృష్ణ! 26

పలుమఱు విశ్వ క– ల్పన చేయు బ్రహ్మ
సదనమౌ నాభికం – జముఁ జూపు కృష్ణ! 27

---

4. మణి గణకలిత

5. బహుకోటులున్న

అనుపమ మణిమేఖ - లావృతంబైన
మృగపమధ్యంబు నె - మ్మినిఁ జూపు కృష్ణ! 28

కనకాంబరాబద్ధ - కలితోరు కాంతి
మయమైన ఊరుయు - గ్మముఁ జూపు కృష్ణ! 29

అంబుధికన్యకా - హస్తోపచార
కలితంబులైన జం - ఘలు చూపు కృష్ణ! 30

బ్రహ్మరుద్రాది ది - కృతులైనవారు
మ్రొక్క నొప్పగు పాద - ములు చూపు కృష్ణ! 31

[6]గంగాతరంగ సం - గత వామపాద
భాసురాంగుష్ఠ మే - ర్పడఁ జూపు కృష్ణ! 32

### ✳ వివిధ మూర్తి విశేషములు ✳

క్షీరవారిధియందు - శేష తల్పమున
శయనించియున్న ము - చ్చటఁ జూపు కృష్ణ! 33

అష్టభుజములతో - అమృతాబ్ధి నడుమ
కొలువున్న మహిమ మ - క్కువఁ జూపు కృష్ణ! 34

బాలుండవై వట - పత్రంబుమీద
పవళించురీతి త - ప్పక చూపు కృష్ణ! 35

మొనసి శ్వేతద్వీప - మున దివ్యకాంతి
నొనరు నీ రూపంబు - నొగిఁ జూపు కృష్ణ! 36

---

6. గంగా తరంగిణీ -గత వామపాద

అతలాది సర్వలో - కాధార మగుచు
బలమైన విశ్వరూ - పముఁ జూపు కృష్ణ! 37

తగ భూతతతుల కం - తర్యామివైన
భావమెల్లను తేట - పఱుపవే! కృష్ణ! 38

అనిశ మర్చా విగ్ర - హా కృతిగాను
మెలఁగు నీ లీల ల - ర్మిలిఁ జూపు కృష్ణ! 39

విభవావతారముల్ - వింతగాఁ దాల్చి
పొలుపొందు సరణి లి - ప్పుడుఁ జూపు కృష్ణ! 40

ఆ వాసుదేవ ము - ఖ్య [7]వ్యూహములకు
లలిమించు రూపంబు - లను జూపు కృష్ణ! 41

నిత్యసూరులు గొల్వ - నిలిచి, వైకుంఠ
పురిని నీవున్న సొం - పును జూపు కృష్ణ! 42

తనర నన్నిటి కతీ - తంబైన పరమ
పదమందు వెలుఁగు నీ - ప్రభఁ జూపు కృష్ణ! 43

[8]ఇదమిత్థ మనఁగూడ - కెల్ల విశ్వంబు
తానైన వస్తుత - త్త్వముఁ జూపు కృష్ణ! 44

సద్గురుస్వామివై - సతత మన్నిటిని
చిర తరంబుగ బోధ - సేయవే! కృష్ణ! 45

---

7. వ్యూహములను

8. ఇది మిథ్య యనఁగూడ, - దెల్ల విశ్వంబు

## ✳ శరణాగతి ✳

వసుధ నే గురుకులా - వాసంబుఁ జేయు
శక్తి చాలక, [9]నీవె - శరణంటి కృష్ణ! 46

కాన నన్నెట్లైనఁ - గడతేర్పఁదగిన
భారంబు నీకుఁ ద - ప్పదు సుమ్ము కృష్ణ! 47

నీవు నా స్వామివి, - నీ సొమ్ము నేను
కావున బాధ్యమె - క్కడఁబోదు కృష్ణ! 48

శేషభూతను నేను, - శేషివి నీవు
కావున బాధ్య మె - క్కడఁ బోదు కృష్ణ! 49

పావనుండవు నీవు, - పతితను నేను
కావున బాధ్యమె - క్కడఁ బోదు కృష్ణ! 50

నీవు బాధ్యుఁడవని - నే నిన్ని నాళ్లు
కనలేకపోతిని - క్రమముగా కృష్ణ! 51

మాయ, నహంకార, - మమకారములను
తగిలి దేహము లెన్నొ - దాల్చితి కృష్ణ! 52

నేటికైననుగాని - నీ కటాక్షమున
నీ బాధ్య మెఱిఁగితి - నిజముగా కృష్ణ! 53

ఇఁక [10]నేను జన్మంబు - లెత్త నటంచు
నామది ధైర్యము - న్నది చాల కృష్ణ! 54

---

9. నిన్నె - శరణంటి కృష్ణ!

10. నేహ్యా జన్మంబు - లెత్త నటంచు

ఏ పుణ్యములు చేసి - యింత ధైర్యంబుఁ
జెందితివన్న, నేఁ - జెప్పెద కృష్ణ! 55

పరఁగ నేఁ జేయు పా - పము లిన్నియనుచు
గుఱిచేసి లెక్కింపఁ- గూడదే! కృష్ణ! 56

అతిదంభ కుత్సి తా - హంకారములకు
ధరను నే మూలభూ - తను నైతి కృష్ణ! 57

కాన, కామాది వ - ర్గము నాశ్రయించి
పాప దుర్విషయాళి - పాలైతి కృష్ణ! 58

నిరతంబు పరులను - నిందింతుఁ గాని
నా దుర్గుణంబు లె - న్నఁగనేర కృష్ణ! 59

అనిశంబు పిన్న పె - ద్దంతర్వు లేక
తెగువ నెవ్వరినైనఁ - దిట్టుదు కృష్ణ! 60

తామస రాజస - ద్వయముచేఁ జిక్కి
కోప తాపములకేఁ - గుదురైతి కృష్ణ! 61

అదిగాక, భాగవ - తాపచారముల
నుడుగక కావింపు - చుందునే! కృష్ణ! 62

అటుగాన పతిత జ - నాగ్రణి నైతి
పలుమఱు నిన్ని చె - ప్పఁగనేల? కృష్ణ! 63

అజ్ఞాని, నపరాధి - నగుచు, నీ పతిత
పావన బిరుదు చే - పట్టితి కృష్ణ! 64

కాన నీ బిరుదు నన్ - కడతేర్చు ననెడి
ధైర్యంబు మదిని సి - ద్ధంబయ్యె కృష్ణ! 65

బెరసి నీ యందున్న - బిరుదు లన్నియును
చేకొని నన్ను ర - క్షింపవే! కృష్ణ! 66

మును పజామిళు ని - మ్ముగఁ బ్రోచినట్టి
ఘన బిరుదే నన్నుఁ - గడతేర్చు కృష్ణ! 67

వసుధ నీ పతితపా - వన కీర్తిబిరుదు
పట్టితి, నింక నాకు - భయమేమి? కృష్ణ! 68

ఈ బిరుదునుబట్టి - యిక జన్మ మెత్త
నని ప్రమాణంబు చే - యంగవచ్చు కృష్ణ! 69

పరమాత్మ! 'యాదృశీ - భావనా యత్ర
సిద్ధిర్భవతి తాదృ - శీ' యండ్రు కృష్ణ! 70

అటుగాన ఈ నిశ్చ - యంబు నామదిని
పట్టుగా నిల్ప నీ - భారమో కృష్ణ! 71

మూలమంత్రార్థ మి - మ్ముగ నాత్మ మీకె
శేషభూతంబని - చెప్పునే! కృష్ణ! 72

సరవి నన్యులకు శే - షంబు గాదనుచు
ఉప్పొంగి బోధింపు - చున్నదే! కృష్ణ! 73

కాన నీ సొమ్ము నె - క్కడనున్న వెదకి
[11]చేకొనుపని నీకు - సిద్ధమే! కృష్ణ! 74

11. చేకొను పని నీది - సిద్ధము కృష్ణ!

పాదంబు లెవరైనఁ - బట్టిన, పట్టు
కొంకక విడిపించు - కోరాదు కృష్ణ! 75

ఇపుడు నీ పాదంబు - లేను బట్టితిని
నీవింక విడిపింప - నేరవే! కృష్ణ! 76

ధర నొప్పు మంత్ర ర - త్న ద్వయార్థంబు
చెలఁగి యీ ధైర్యంబు - చెప్పెనే! కృష్ణ! 77

ఈ ద్వయ మాదియం - దిందిర [12]కీవు
తెలిపితి; విపుడు సం - దియమేమి? కృష్ణ! 78

ఘనముగా సకల యో - గములు బోధించి,
అటమీద బహునిశ్చ - యంబుగా కృష్ణ! 79

'సర్వధర్మముల నెం - చక నన్ను శరణు
పొందు, పాపములన్ని-పొలియింతు' కృష్ణ! 80

అని చరమశ్లోక - [13]మమర బోధించి,
తిరుగేమి చెప్పవై - తివి నీవు కృష్ణ! 81

కాన, సిద్ధాంత వా - క్యం బిదే యనుచు
నా మదిలో చాల - నమ్మితి కృష్ణ! 82

మహి నొప్పు సర్వధ - ర్మములఁ బోవిడిచి
పొసఁగ నీ శరణు నే - పొందితి కృష్ణ! 83

కాన, నా పాప సం-ఘములఁ బోఁగొట్టి
పరమపదం బిచ్చి - పాలింపు కృష్ణ! 84

12. కీవె 13. మపుడు బోధించి,

సొమ్ము గల్గిన నీవు - సొమ్ముఁ గైకొనెడి
పనికి నే నిన్ని చె - ప్పంగ నేల? కృష్ణ! 85

హరి! నేను నీ సొమ్ము - నైతి, నీ వింకఁ
[14]గైకొనఁదగియుంటె - కైకొను కృష్ణ! 86

పోఁగొట్ట వలసితే - పోఁగొట్టు, దీని
కేనింత ప్రార్థింప - [15]నేలనే? కృష్ణ! 87

[16]నీవు వేసిన దిక్కు - నే నుందు; హాని,
లాభంబు లెవరివో - లక్షింపు కృష్ణ! 88

రహిమీఱఁ గపికిశో - రన్యాయమాత్ర
మేని స్వశక్తి నా - యెడ లేదు కృష్ణ! 89

పొలసి మార్జాల కి - శోరంబువలెను
నీవు పెట్టిన చోట - నే నుందు కృష్ణ! 90

నీవు ప్రేరేపక - నిఖిల కర్మములు
ఊరకె నేను చేయు - ట లేదు కృష్ణ! 91

చెలఁగి నీ ప్రేరణ - చేతనే ప్రకృతి
కర్మముల్ చేయు నె - క్కడనైన కృష్ణ! 92

[17]ప్రకృతితోఁ గూడిన - పాపంబుచేత
అవియెల్ల నేఁ జేతు - ననుకొందు కృ॥ 93

---

14. గైకొనఁ దగియున్న 15. నేలయ్య? కృష్ణ!
16. నీవు వైచిన చోట - నేనుందుఁగాని
17. ప్రకృతితోఁగూడి నేఁ - బాపముల్ చేసి,

నిజము భావించితే - నే నిందులోన
నొక కర్మమైనఁ జే - యుట లేదు కృష్ణ! 94

అక్కట! 'నేను, నే' - ననెడి అహంత
ఊరక భ్రమపెట్టు - చున్నదే! కృష్ణ! 95

ఇటువంటి నా భ్రాంతి - నెడఁబాపు మనుచు
సొలసి నీ మఱుఁగు నేఁ - జొచ్చితి కృష్ణ! 96

జగతిపై నన్యథా - శరణంబు లేక
మఱుఁగుఁ జేరితి, నన్ను-మన్నింపు కృష్ణ! 97

ప్రకృతిగుణంబు లే - ర్పడ నన్నుఁ బట్టి
ఇఁకమీద బాధింప - నీయకే! కృష్ణ! 98

## ✳ ముక్తికాంక్ష ✳

మాయచే జన్మ క-ర్మ ప్రవాహమునఁ
[18]బడనీక నన్ను చే - పట్టవే! కృష్ణ! 99

కపటంబులేక, ని - క్కముగ నా ఆత్మ
తత్త్వంబుఁ జూపవే!-దయచేసి కృష్ణ! 100

ధరణిలో సంశయా - త్మ నశించుఁ గనుక
మొనసి నా సంశయ - మ్ములు దీర్చు కృష్ణ! 101

పరమయోగీంద్రుల - భావ నిశ్చయము
నా యాత్మ నుంచు ని-ర్ణయముగా కృష్ణ! 102

---

18. బడలిన నన్నుఁ జే - పట్టవే కృష్ణ!

అక్కట! సూక్ష్మ దే - హము నిల్పి, యిన్ని
స్థూలదేహములఁ దె - చ్చుచునుండె కృష్ణ! 103
కావున, లింగభం-గముఁ జేసి, వేగ
దేహధారిత్వంబుఁ -దీర్పవే! కృష్ణ! 104

అవ్యయంబై పున-రావృత్తి లేని
ఉన్నత పదము నా - కొసఁగవే! కృష్ణ! 105

ఘనుఁడవై నిర్హేతు - కంబుగాఁ దొలుతఁ
గరుణ నేలితివి [19]త - క్కక నన్ను కృష్ణ! 106

నిన్నొల్ల కావల నేఁ - బోవు తఱిని
పోనీక ప్రోచితె - ప్పుడు నీవు కృష్ణ! 107

లలితంబులైన లీ - లలు చూపి నన్ను
కోరి మాలిమిచేసి - కొంటివే! కృష్ణ! 108

మద్గురుస్వామివై - మంత్రోపదేశ
మిచ్చితి వాదియం - దిరవుగా కృష్ణ! 109

అటుమీఁద నాత్మ త - త్త్వార్థ సంగతులు
ప్రియము దీపింపఁ జె - ప్పితి వీవె! కృష్ణ! 110

తలఁచిన యపుడె ముం - దఱ వచ్చి నిలిచి
[20]ఎడలేని సంతోష - మిత్తువే! కృష్ణ! 111

తల్లిదండ్రులు, సహో - దరులైన నన్ను
లీల నీ కరణి లా - లింపరే! కృష్ణ! 112

19. చక్కఁగ నన్ను కృష్ణ!
20. ఎనలేని

చెలరేఁగి నాకు వ - చ్చిన యాపదలకు
పరఁగ నీవుండఁగా - బ్రతికితి కృష్ణ! 113

నీవంటి మిత్రుఁడీ - నిఖిల లోకముల
చేరి నే వెదకినఁ - జిక్కునే? కృష్ణ! 114

రూఢిగా నిపుడు నీ - ఋణము నిక్కముగ
కోరి నే నిఁకఁ దీర్చు - కోలేను కృష్ణ! 115

నీ మన్ననంబుల - న్నియును దలంచి
నామది కరఁగుచు - న్నది చాల కృష్ణ! 116

నా యపచారముల్, నా-దుర్గుణములు
సైరించి ప్రోచిన - స్వామివే! కృష్ణ! 117

దోషభోగ్యుండవై - తొలినుండి నన్ను
కొంకక రక్షించు - కొంటివే! కృష్ణ! 118

ఆ రీతిఁ బ్రాణ ప్ర - యాణ కాలమున
నీవు నా ముందఱ - నిలువవే! కృష్ణ! 119

తఱచైన వాత పై - త్య శ్లేష్మ బాధ
లంటిన, మఱువనీ - యకు నిన్ను కృష్ణ! 120

కుదురైన సగుణ ని - ర్గుణ సామరస్య
భావమెప్పటికిఁ ద - ప్పక చూపు కృష్ణ! 121

పాపపు దేహ ప్ర - పంచ వాసనలు
తోఁపనీయక నన్ను - తుదఁ జేర్చు కృష్ణ! 122

పరమాత్మ! నీవు నీ - పాదంబులాన
ముక్తిఁ బొందింపు మి - మ్ముగ నన్ను కృష్ణ! 123

దివ్య దేహంబులు, - దివ్య లోకములు
ఇచ్చెదనంటివే - నిపు డొల్ల కృష్ణ! 124

అవ్యయబ్రహ్మమై - నట్టి నీయందు
పొందక నా జాలి - పోదింక కృష్ణ! 125

చెలఁగి యంతఃకరణ - సీమ నీవున్న
భారంబు నీకుఁ ద - ప్పదు సుమ్ము! కృష్ణ! 126

[21]మిగులఁ బ్రారబ్ధంబు - మీఁద నీ వింక
భారంబు పెట్టిన - పని గాదు కృష్ణ! 127

హరి! నీవు కావలె - నంటె ప్రారబ్ధ
మెంతది? పోఁగొట్టు - మీలోనె కృష్ణ! 128

కాలంబు చేరువై,-కదిసి కొంపోవు
తఱియందు నా స్వతం - త్రంబేమి? కృష్ణ! 129

దేవ! నే ముక్తిఁ బొం - దెడి యుపాయంబు
భావించు ప్రజ్ఞ త - ప్పక చూపు కృష్ణ! 130

అత్యాతురంబుగా - నంటి నీ మాట
ఎగ్గుపెట్టక, ప్రేమ - నేలవే! కృష్ణ! 131

చెలరేఁగి నాకుఁ దోఁ - చిన వెల్ల మనవి
చేసితి; నింక నీ - చిత్త మో కృష్ణ! 132

21. మెఱయు ప్రారబ్ధంబు

నిన్నిట్లు వినుతింప - నే నెంతదాన?
[22]తప్పు లెల్లను గాచి - దయఁ జూడు కృష్ణ! 133

## ✳ మంగళము ✳

మంగళ మలమేలు - మంగ చిత్తాబ్జ
సారంగ నిభ! నీకు - జయ మంగళంబు! 134

సురుచిరగుణ! నీకు- శుభమంగళంబు!
[23]సద్గురుండగు నీకు - సర్వమంగళము! 135

## ✳ సమర్పణము ✳

అని యిట్లు శ్రీవేంక- టాద్రీశుఁడగుచు
నన్నేలు తటిగొండ - నరసింహు పేర 136

వాసి కెక్కిన నంద-వరకులోద్భవుఁడు
శ్రీకరంబైన వా - సిష్ఠ గోత్రుండు 137

వసుధలోఁ గానాల - వంశ వర్ధనుడు
అగు కృష్ణయార్యున - కతి భక్తితోడ 138

వర భార్యయగు పతి - వ్రత మంగమాంబ
సుత వెంగమాంబ హె - చ్చుగ మోక్షపదము 139

కామించి, సద్గురు-కరుణ దీపింప
మహనీయమగు కృష్ణ - మంజరిఁ జెప్పి, 140

వరభక్తితో శ్రీని - వాసుల దివ్య
పదయుగళికి సమ - ర్పణ మొప్పఁ జేసె. 141

22. తప్పొప్పులను గాచి
23. సద్గురువర! నీకు

## ✳ స్తోత్ర మహిమ - ఫలశ్రుతి ✳

ఇది కృష్ణ జపతుల్య, - మిది మోక్షపదము
శిష్టులై యిది పఠిం - చినవారి కెల్ల 142

మొనసి కామ్యార్థముల్ - మున్నిచ్చి, తుదను
పరమపదం బిచ్చు - బాలకృష్ణుండు. 143

కావున ఈ కృతి-కమలాక్షు కరుణ
నా చంద్రతారార్క-మై యొప్పుఁగాత! 144

ఓమ్ తత్ సత్

శ్రీ కృష్ణార్పణమస్తు.





## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# శ్రీ వేంకటేశ్వర జలనిధి స్కీమ్



సమీక్ష: తిరుమలలోనూ- తిరుపతిలోనూ, ఆ చుట్టు పక్కలా ఉండే యాత్రికుల వాడకానికి సరిపడేటట్లు నీటిని సమకూర్చ డానికి తిరుమల తిరుపతి దేవస్థానం (తి.తి.దే) ప్రారంభించిన శ్రీ వేంకటేశ్వర జలనిధి పథకం అద్వితీయమైనది.

తి.తి.దే. వారు ప్రస్తుతం రోజుకు 20 లక్షల టన్నుల నీటి సరఫరా కోసం విద్యుత్ ఛార్జీలు, తదితర ఖర్చులకు కొన్ని కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నారు. తిరుమలలో ఉన్న నీటి వనరుల అభివృద్ధికోసం కూడా చెప్పకోదగ్గ మొత్తం వెచ్చిస్తున్నారు. తి.తి.దే. వారు యాత్రికుల నీటి సదుపాయానికై సుమారుగా రూ. 100 కోట్ల వ్యయంతో

లక్ష్యం: తిరుమల పంచాయతీ - తిరుమల మునిసిపాలిటీలకు చెందిన జనాభాకూ, యాత్రికులకూ త్రాగడానికీ ఇతర అవసరాలకూ కావలసిన నీటి సదుపాయం కల్పించడం కోసం విరాళాల రూపంలో వచ్చిన ధనాన్ని వెచ్చించడం ఈ పథకంలోని ఉద్దేశం. క్రమంగా చుట్టుపక్కల ప్రదేశాలలోని వారికి కూడా ఈ సదుపాయం కలిగించడం జరుగుతుంది. ఆనకట్టలు, చెక్ డ్యామ్‌లు, నీరు నిలవ చేసే ట్యాంక్‌లు, పెర్కొలేషన్ ట్యాంకుల నిర్మాణానికీ, నీటివనరులను మెరుగు పరచడానికి ధనం వెచ్చించడం జరుగుతుంది.

విరాళం వివరాలు : ఈ పథకానికి కనీసం రూ. 1,000/- విరాళంగా ఇవ్వాలి. రూ.1000/-కి తక్కువ ఉన్న విరాళాలను దాతకి తెలియజేయకుండానే శ్రీవారి హుండీ ఖాతాలో జమ చేయడం జరుగుతుంది. విరాళాలన్నీ ఒక జాతీయ బ్యాంకులో డిపాజిట్ చేసి, వాటిపై వచ్చే వడ్డీని ఈ పథకానికై ఉపయోగిస్తాం. విరాళాలను "ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, శ్రీ వేంకటేశ్వర జలనిధి స్కీమ్, టి.టి.డి తిరుపతి" పేరిట చెక్కు/డి.డి.తీసి "ఛీఫ్ ఇంజనీర్, టీ.టీ.డి, తిరుపతి - 517 501, ఫోన్: 0877-2230660" అనే చిరునామాకు పంపగలరు.

వ్యక్తుల పేరిట కానీ, సంస్థల పేరిట కానీ విరాళాలను పంపవచ్చు. విరాళాలకు ఆదాయపుపన్ను చట్టంలోని సెక్షన్ 80(జి) క్రింద పన్ను మినహాయింపు కలదు.

సౌకర్యాలు: రూ. !

దాత కుటుంబానికీ సంవత్సరానికి మూడు రోజులు (వరుసగా కానీ, మూడు వేర్వేరు రోజులు కానీ) ఏ.ఆర్.పి. కౌంటర్ ఉచిత బస, లేదంటే డబ్బు చెల్లించే పద్ధతిలో వీలును బట్టి వి.ఐ.పి. బస కల్పిస్తాం. దాతనూ, దాత కుటుంబాన్నీ (ఐదుగురికి మించకుండా) సంవత్సరానికి మూడు రోజులు (వరుసగా కానీ, మూడు వేర్వేరు రోజులు

ఒకమారు 1(

బహుమానంగా ఇస్తాం. దాత మొదటి మారు దర్శనానికి వచ్చినప్పుడు శ్రీవారు - పద్మావతీ అమ్మవార్ల చిత్రాలతో బంగారు పూత పూయబడిన వెండి పతకం ఒకటి బహూకరిస్తాం.

ఈ సౌకర్యాలు వ్యక్తులకు జీవితాంతం, సంస్థలకు 20 సంవత్సరాల పాటు లభిస్తాయి.

Published by Sri A.P.V.N. Sarma, I.A.S., Executive Officer
T.T.Devasthanams and Printed at Sri Parasaraya Press, Sri Vyasasramam.